# తెలుగుపూలు

## (బాల గేయాలు)

 

## నార్ల చిరంజీవి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# TELUGU POOLU - *NARLA CHIRANJEEVI*

ప్రచురణ నెం : 2350/2297 2 R

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 1958

పదహారవ ముద్రణ : డిశంబరు, 2001

పదిహేడవ ముద్రణ : మార్చి, 2004

పద్దెనిమిదవ ముద్రణ : జనవరి, 2005

టైటిల్ డిజైన్ : బాలి

వెల : **రూ.10-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**

అబిడ్స్, హైదరాబాద్ - 500 001.

**E-mail : visalaandhraph@yahoo.com**

**విశాలాంధ్ర బుక్ హౌస్,**

అబిడ్స్/సుల్తాన్‌బజార్ - హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.



Printed at : **Kalanjali Graphics**, Hyd - 500 029. Ph·23224831, 555998341

అజేయుని సకలకు:

పాలకడలి వంటి బ్రతుకు దరచిన వేళ
వెలసినావు అమృతకలశి వోలె,
కన్నవారి కనుల వెన్నెల విరబూయ
'తెలుగుపూలు' దాల్చి తేజరిలుము.

ప్రేమతో నాన్న.



# కృతజ్ఞత

ఈ చిన్న పుస్తకం నన్ను 'చిరంజీవి'ని చేసింది. మరిన్ని మార్పూచేర్పులతో ఇప్పుడిది పదియవ కూర్పు. దీన్ని తొలిగా 1946 లో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం ప్రచురించి ప్రచారం చేసింది. ఆదిలో కవిమిత్రులు శ్రీ ప్రయాగ ప్రోత్సాహమిచ్చారు. గురుతుల్యులు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు శ్రద్ధగా పరిశీలించి సలహా లిచ్చారు. తర్వాత శ్రీ .బి. వి. నరసింహారావుగారి చేయూత లభించింది. తదాది తెలుగునాట ఎన్నో ఆశీర్వాదాలు నాకు లభించాయి. తెలుగు బాలబాలికలు చూపిన ఆదరణ నాకు అండాదండ. ఇలా ఎందరెందరో నాకు తోడయ్యారు. మా శంకర్, సంజీవి (సోదర చిత్రకారులు) సదా నా కృషికి సహాయమిస్తున్నారు.

అందరికి వందనాలు.

మరి మా విశాలాంధ్ర ప్రచురణాలయంవారి ప్రత్యేక ఔదార్యంతో నా పుస్తకాలు వన్నెచిన్నెలు సంతరించుకొని వెలువడుతున్నాయి.

మా బిడ్డ అజేయుని సకలతోపాటు, అసంఖ్యాకులైన తెలుగు బాలబాలికలు ఈ పద్యాలకు సాధికారులవుతున్నారు.

- నార్ల చిరంజీవి

# ఆశీర్వచనం

## మద్దులూరి రామకృష్ణ, బి.ఏ., బి.యిడి.

ప్రధానోపాధ్యాయులు, ఉన్నత పాఠశాల, చెరుకూరు.

"మిత్రమా!... పద్యాలు పిల్లలకు అర్థం కావాలి. అందంగా ఉండాలి. ఆనందాన్ని కల్పించాలి. ఈనాటి పిల్లలకు 'తెలుగుపూలు' పద్యాలు ఆ గుణాలను కల్పిస్తాయి. ప్రతి తెలుగుపాప 'తెలుగుపూలు' చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాను..."

## శ్రీమతి రాధాదేవి

పురపాలక సంఘ సభ్యులు, బాపట్ల.

"సోదరా!... మా పిల్లలు "తెలుగుపూలు" చదువుతూ జరిపే సంభాషణలు వింటే చాలు. అవే 'తెలుగుపూల'కు సరైన వ్యాఖ్యానాలనిపిస్తాయి నాకు. వాళ్ళ చర్చలు విని ఎంతో ఆనందాన్ని పొందుతుంటాను. వాళ్ళు ముద్దు ముద్దు మాటలతో ముత్యాల మూటలు కట్టి 'తెలుగుపూలు' పుస్తకానికి సమర్పిస్తున్నారు. చిన్నారి లోకానికి 'చిరంజీవి'గా మీరు మరెన్నో పుస్తకాలు అందించవలసివుంది........."

## కుమారి సుభద్రాదేవి

"మామయ్యా ..... పూలంటేనే నాకెంతో యిష్టం. ఇక తెలుగు పూలంటే మరీ యిష్టం. మా చెల్లెళ్ళు శాంతిశ్రీ, సుజాత రోజా "తెలుగుపూలు" పద్యాలు చదువుతున్నారు. అంత మంచి పుస్తకం మరేదీ లేదని అంటున్నారు వీళ్ళు..."

## అట్లూరి రామారావు
హిందీ పండితులు, ప్రచారసభ, హైదరాబాద్.

"బావగారూ... తెలుగుపూలు తెలుగు బాలసాహిత్యానికే శోభ తెచ్చిన పుస్తకం. తెలుగు సంస్కృతితోపాటు అనేక విషయాలను యింత సరళంగా పిల్లల మనస్సులకు హత్తుకొనేట్లు వ్రాసిన పుస్తకం మరొకటి నే చూడలేదు. ఉపాధ్యాయుడుగా నా అభిప్రాయం కూడా యిదే..."

## శ్రీమతి జయమ్మ
హైదరాబాద్.

"అన్నయ్యా.... తల్లిగా నా అనుభవం ఏమంటే – "తెలుగు పూలు" మా ఇంటికి వచ్చాక మా పిల్లలు కొత్త విషయాలను, అలవాట్లను వాళ్ళంతట వాళ్ళే నేర్చుకున్నారు. పిల్లలను ఏవిధంగా చూడాలి. మంచి విషయాలపట్ల వాళ్ళకు ఎలా ఆసక్తి కలిగించాలి అనే విషయాలను తల్లిగా చదివి నేను నేర్చుకున్నాను. "తెలుగుపూలు" పిల్లలకే కాదు తల్లులకు కూడా మంచి పుస్తకం......."

## కిరణ్ బాబు

"మామయ్యా.... మూడో తరగతిలో తెలిసో తెలియకో పంతులుగారిని అడిగినా, అడగకపోయినా రోజూ నా వీపు బ్రద్దలవుతుండేది. ఆ రోజుల్లోనే మా 'తెలుగుపూలు' పుస్తకం దొరికింది. మా పిల్లలకు బాగా నచ్చింది...... ఎన్నో క్రొత్త అలవాట్లను విషయాలను నేర్చుకున్నాం.... మా అందరి తరఫునా మీకు జేజేలు......."



మూడు కోట్లమంది ముద్దుబిడ్డల గన్న
తెలుగుతల్లి నెపుడు తలచుకొమ్ము
కన్నతల్లి ఘనత కలనైన మరువకు
కలుగు మేలు నీకు తెలుగుబిడ్డ.

అవతరించె నిపుడు 'ఆంధ్ర ప్రదేశము'
తెలుగువారి త్యాగ దీక్ష ఫలము!
ముక్క చెక్కలైన ముక్కోటి బలగమ్ము
కలిసి బ్రతుకు నింక తెలుగుబిడ్డ.

భరతదేశ మనెడు పంట కళ్ళములోన
వడ్లరాసి తెలుగువారి సొమ్ము
తరుగురాదు అన్నదాతల కీనేల
దివ్య నందనంబు తెలుగుబిడ్డ.

మధుర మధురమైన మనభాష కంటెను
చక్కనైన భాష జగతి లేదు
తల్లి పాలకంటె తనయుల కే పాలు
బలము నీయగలవు? తెలుగుబిడ్డ.

మొదట నేను భరతపుత్రుడ ననుకొమ్ము
పిదప తెలుగుదనము పెంచుకొమ్ము
భరత పద్మమందు పసిడిరేకవు నీవు
తేనె బొడ్డు నీది తెలుగుబిడ.

దేశ మేదన్నచో తెలుగుదేశ మనుము
జాతి యేదన్నచో తెలుగుజాతి యనుము
వంశ మేదన్నచో తెలుగువాడ ననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగుబిడ్డ.



మనల గ్రమ్మినట్టి మసక చీకటిజీర్చి
తరళకాంతితోడ తరలి వచ్చె
ప్రాగ్దిశాగ్రమందు స్వాతంత్ర్య భానుండు
నిలిచి చూడవోయి తెలుగుబిడ్డ.

మేలుకొలుపు పదము మీసాలతాత భూ
పాల రాగమెత్తి పాడ దొడగె
కొసరి బోసియవ్వ కూనిరాగాలతో
త్రిప్పె రాట్నమదుగొ! తెలుగుబిడ్డ.

వింత గొంతులెత్తి పిలుచుచున్నవి నిన్ను
'కావు కావు' మనుచు కాకి మూక
పారిజాత పుష్ప పరిమళములు వీచె
తెల్లవారె ననుచు తెలుగుబిడ్డ.

వెలుగు రాక ముందె వేగ నిదుర లెమ్ము
ప్రొద్దు బొడవ నిదుర బోవరాదు
సోమరితనమేల శుచి శుభ్రముల యందు
తెలిసి నడుచుకొమ్ము తెలుగుబిడ్డ.

క్రమము దప్పబోకు కాలకృత్యములను
ఆయువునకు పట్టులవియె సుమ్ము
బద్ధకింతువేని పాడు రోగములతో
దేహమెల్ల జెడును తెలుగుబిడ్డ.

వెంట దోడులేక ఒంటిగా స్నానము
చెరువు కాల్వలందు చేయవలదు
నీకు దెలియరాని నీటిగుండము లుండు
కలుగు మోస మచట తెలుగుబిడ.

స్నానమైన పిదప చల్దిబువ్వ తినుము
కాఫీ టీ లు మేలు కావు నీకు
వీలు కలిగెనేని పాలు త్రాగుట మేలు
బలము బుద్ధి పెరుగు తెలుగుబిడ్డ.

వేళ మీరకుండ వేవేగ సర్దుకొని
తోటివారు వెంట తోడురాగ
పొమ్ము బడికి గంట మ్రోగక మున్ముందె
సలుపబోకు జాగు తెలుగుబిడ్డ.

పాఠముల చదువక బడికి మానితివేని
నిన్న చదువుతోడ నేటి చదువు
మన్ను గలిసిపోవు మరి కష్టమాపైన
తిరిగి చదువ నీకు తెలుగుబిడ్డ.

పుస్తకముల నీవు పూవువోలెను చూడు
చింపబోకు మురికి చేయబోకు
పరుల పుస్తకముల ఎరువు తెచ్చితివేని
తిరిగి యిమ్ము వేగ తెలుగుబిడ్డ.

చదువుచున్న వేళ జాగ్రత్తగా నీవు
స్పష్టముగను నోట బలుకవలయు
గొణుగుకొన్న యెడల కొండంత తప్పులు
తెలియ కొదుగుచుండు తెలుగుబిడ్డ.

వల్లెవేసినట్టి పాఠాలు మరువకు
చదువ తగినదేది వదలబోకు
సాన బట్టుకున్న జాతి రత్నమ్మైన
దీప్తి జెందదయ్య తెలుగుబిడ్డ.

పట్టుబట్టి చదివి 'బట్టీ' పెట్టుటగాదు
సార మెరిగి నీవు చదువ వలయు
అర్థమయ్యేనేని ఆ పైన కంఠత
సులభమౌను నీకు తెలుగుబిడ్డ.

తెలియనంత మాత్ర దిగులేల? వగపేల?
తిరిగి తిరిగి చదువ దెలియగలదు
నడువ నడువ త్రోవ నలిగిపోకుండునా
దిగులు చెరుపుజేయు తెలుగుబిడ్డ.



నిలిపి కుదురైన దస్తూరి నేర్చుకొమ్మ
వ్రాయవలెను ముత్యాలసరాల రీతి
చదువువారలు విసిగి వేసారునటుల
గొలుసువ్రాతలు వ్రాయకు తెలుగుబిడ్డ.

ఒత్తు లేనిమాట ఒత్తి పలుకుచుంద్రు
ఒత్తులున్న పలుక కూరకుంద్రు
వ్రాయునపుడు కూడ వచ్చు ఆ తప్పులే
తొలుత దిద్దుకొనుము తెలుగుబిడ్డ.

శ్రద్ధ లేనియెడల చదువు సాములు రావు
శ్రద్ధయున్న రాని చదువు లేదు
శ్రద్ధ కలిగెనేని చంద్రమండలయాత్ర
సులభసాధ్యమె యగు తెలుగుబిడ్డ.

చదువు రానియట్టి సాటి విద్యార్థిని
చిన్నచూపు జూడ జెల్లదయ్య
విప్పి చెప్పవలయు విశ్రాంతి వేళల
తెలియ నతనికెల్ల తెలుగుబిడ్డ.

చిరుతప్రాయమందు చేరి నేర్చిన విద్య
ఒంటబట్టి బ్రతుకు నంటివచ్చు
క్రొత్తబట్ట కద్దుకొన్నట్లు రంగులు
పాతబట్ట కంటు వదునె! బిడ్డ.

ఎలమి చదివినంత ఎల్లవారికి రావె
జాతిబట్టి రావు చదువు లెపుడు
వీలు కలిగి నేర్వ విద్య లందరి కబ్బు
ఎరువులున్న మొక్క లెదుగురీతి.

ఉన్నవాని చదువు ఊరేగబోవదు
లేనివాని చదువు హీనపడదు
చెఱకువంటి చదువు చేరి తినిన నోట
తీపిరసమె చిందు తెలుగుబిడ్డ.

శిల్పిచేత గండశిల బొమ్మరూపెత్తు
కొంటెచేతి రాయి గోడవతెచ్చు
చదివి యొకడు వినయసంపన్నుడౌను, వే
రొకని కదియె గర్వ ముట్టికట్టు.

పాఠమందు బోధపడనట్టి విషయంబు
లర్థమెరుగ గురువు నడుగుమయ్య
తెలిసి తెలియకున్న తెల్లమొగమువేసి
నిలిచియుండ తగదు తెలుగుబిడ్డ.

ఆడితప్పననుచు ఆలి నమ్మిన రాజ
కథలు చదువ నేమి కలదు ఫలము?
ముసిడిపండు దినిన విసమెగాక చెఱకు
తీపిరాదు నిజము తెలుగుబిడ్డ.

విప్పి చెప్పలేక వీపు బ్రద్దలుచేయు
గురువు గురువుకాడు కొరవికాని
మనసు కెక్కునటుల మధురమ్ముగా జెప్ప
గలుగునతడె గురువు తెలుగుబిడ్డ.

పొడిచి బాధపెట్టు పోలీసువలెగాక
వ్యాధిమూల మరయు వైద్యుబోలె
కొసరి పిన్నవారి గుప్తసంశయముల
తీర్చునతడె గురువు తెలుగుబిడ్డ.

పరులతోడ నీవు భాషించునప్పుడు
పెళుసుమాట లెపుడు బలుకబోకు
కాకిగోలకన్న కర్ణపేయము గాదె
చిలుక మాట పాట తెలుగుబిడ్డ.

బడి వదలినతోడ బ్రాల్మాల కీ వింటి
కేగుమయ్య నడుమ జాగు తగదు
నెమ్మి కన్నవారు నీకొరకు ఎదురు
తెన్నులు గనుచుంద్రు తెలుగుబిడ్డ.



ఇంట నున్నవేళ ఏమరియుండకు
దొడ్డిలోన పూలతోట బెంచు
పూలతోనె మనసు పుష్పింపవలె సుమ్ము
మలయ సౌరభముల తెలుగుబిడ్డ.

ఇంట పిన్న పెద్ద లెందరో యుందురు
వచ్చిపోవుచుంద్రు బంధుజనులు
'ఓసి' 'ఓరి' యనెడు బాస లాడతగదు
పిలిచి పలుకునపుడు ప్రేమ వలయు.

భాగ్యవంతులైన పరుల బిడ్డల జూచి
ఇంట గోలచేసి ఏడ్వతగదు
పేదవారి యింట పెన్నిధు లుండునా
తెచ్చి నీకొసంగ తెలుగుబిడ్డ.

వినయ మున్నచోట విత్తమ్ము గనరాదు
సిరులు శీలమున్న అరుదు విద్య
మరువకయ్య విద్య తరుగు విరుగు లేని
కలిమి యనెడు మాట తెలుగుబిడ.

పదుగు రున్నచోట భాషింప భయమేల
నిలిచి ధైర్యమూని పలుకుమయ్య
చిన్నవైన యంత సింహాలు బెదురునా
చెలగి విక్రమించు తెలుగుబిడ్డ.

తరముగాని పనులు నెరవేర్చెద నటంచు
పరులవద్ద నమ్మ బలుకరాదు
పలికి చేయకున్న తలయెత్తుకోలేవు
పలువు రెదుట నీవు తెలుగుబిడ్డ.

బట్టమురికి తెలుపు బద్ధకస్తుండంచు
కొండెమాట తెలుపు కుటిలుడనుచు
ఓర్వలేమి తెలుపు గర్విష్ఠియంచును
తెలియు మెవ్వ డెవరొ తెలుగుబిడ్డ.

చదువు రానివాని జనులు మెచ్చరు సుమ్మ
చదువ నేర్చువాని జగము మెచ్చు
దేశ కాల గతులు తెలియగా వచ్చును
తెలియు మంచి చెడ్డ తెలుగుబిడ్డ.

పదియు నెన్మిది పర్వాల భారతము
ద్వాదశ స్కంధముల నొప్పు భాగవతము
మరియు షట్కాండమైన రామాయణమును
చదువవలెనయ్య చక్కగా సార మెరిగి.

పదువు రున్నచోట పాఠాలు వినువేళ
నిదురబోవుచోట చదువువేళ
సభల నున్నవేళ సద్దు లేకుండగా
మెలగుమయ్య నీవు తెలుగుబిడ్డ.

దేశభక్తి బెంచు దివ్య గీతములను
నెనరుపూని మీరు నేర్వవలయు
వాడవాడలందు పాడవలయు సుమ్మ
దీక్షకలిగి మీరు తెలుగుబిడ్డ.

దేశ మనగ వేరె దివ్యవస్తువు లేదు
దేశ మీవె నీవె దేశ మయ్యా
కంకణంబు దాల్చి కాపాడవలె సుమ్మ
దేశ గౌరవంబు తెలుగుబిడ్డ.

స్వేచ్ఛకై ఒరిగిన వీరాధివీరుల
చరితలన్ని నీవు చదువవలయు
ఉబుసుపోని కబురు లూరక వాగిన
ఫలిత మేమి కలదు తెలుగుబిడ్డ.

మాతృభూమి కొరకు మరణించినట్టి ఆ
బాలవీర కథలు పాడవోయి
వీరరసము వెల్లివిరియంగ దేశాన
దీప్తి నింపవోయి తెలుగుబిడ్డ.



రాష్ట్రసిద్ధికై పొట్టి శ్రీరాములయ్య
నిరశన వ్రతదీక్ష పూని మృతుడయ్యె
అమరజీవిని స్మరియించి అంజలించి
పులకలెత్త కీర్తించుము తెలుగుబిడ్డ.

కత్తిబలము నమ్మి ఘన చక్రవర్తులు
మాడినారు రూపు మాసినారు
ప్రజల మేలుకొరకు బలియైన త్యాగులు
నిల్చిపోదు రవని నిల్చువరకు.

లోక మెుక్క యిల్లు లోకులందరు నొక్క
తల్లి బిడ్డ లన్నదమ్ము లనగ
దేశ దేశ జనులు తీయనిబంధాల
కలిపి బ్రతుకవలయు తెలుగుబిడ్డ.

గద్దెనెక్కిన ప్రతివాడు ఘనుడు గాడు
కొమ్మ వ్రేలాడిన గబోది గొప్పదౌనె
పిన్నవారి మనసెరిగి పెంచువారె
తేనెపెర వంటి పెద్దలు తెలుగుబిడ్డ.

ప్రజల వాంఛ లెరిగి పాలింపలేనట్టి
చెత్తవాని కేల పెత్తనంబు
గ్రుడ్డికంటి కేల కుంచెడు కాటుక
విలువమాలినదగు తెలుగుబిడ్డ.

చెడ్డవాని కేల చేయెత్తి దండంబు
రాతిబొమ్మ కేల రామభజన
కొండముచ్చు కేల గొజ్జంగి పూనీరు
తలపబోరు ఘనులు తెలుగుబిడ్డ.

ధర్మగుణము మించు ధనధాన్యములు లేవు
విద్యకన్న మించు విభవ మేది
నీతి వేరెలేదు నిజము పల్కుట కంటె
తెలిసికొమ్ము నీవు తెలుగుబిడ్డ.

నల్లనిదని విడువజెల్లునె కస్తూరి
తెల్లనిదని దాల్తె రెల్లుపూవు
వన్నెలోన నేమి వైభోగమున్నది
విలువ కట్టిచూడ తెలుగుబిడ్డ.

మాటజూడ కటువు మనసుజూడ మధురము
నారికేళఫలము తీరు నుంద్రు
వారిమాట కటువు వదలి మనసులోని
తీయదనము కొమ్ము తెలుగుబిడ్డ.

వేషభూష లరసి పీట వేయకుమయ్య
మనసు లోతులెరిగి మసలుమయ్య
పేరు చూచి నేతిబీరకాయను పిండి
తీయగలవె నేయి? తెలుగుబిడ్డ.

ఎంత స్నేహమున్న ఎంగిలి దినబోకు
పాడుజబ్బు లెన్నొ వచ్చునయ్య
కంచమందు చేయి కడుగరా దెన్నడు
దీని మరువకయ్య తెలుగుబిడ్డ.

చిలిపితనమె చాలు జీవనమ్ము చెరుప
చిన్నదోమ తెచ్చు పెద్దజబ్బు
చిన్న పెద్ద యంచు 'చెడు' అన్నదాని
కొలత లేలనయ్య తెలుగుబిడ్డ.

ఎంత చెలిమియున్న ఎగతాళిచేయకు
సరసమంత నంత విరసమగును
మాట జారెనేని మరి తీసుకోలేము
తెలిసి మెలగుమయ్య తెలుగుబిడ్డ.

ఆప్తగణముతోడ అన్నదమ్ములతోడ
పిచ్చితగవు లెపుడు పెంచుకొనకు
ఇంట లోకువైన ఇరుగులో పొరుగులో
తేలికగుదువయ్య తెలుగుబిడ్డ.


కందుకూరి


గిడుగు


గురజాడ

విప్లవ గుణశాలి వీరేశలింగము
పెంకె పండితులకు పిడుగు గిడుగు
మన మహామనీషి మనవాడు గురజాడ
తలచుకొనుము వీరి తెలుగుబిడ్డ.

రేపు మాపు తెలుగు రూపురేకలు దిద్ది
ధారవోసినారు తమ బ్రతుకులు
ఎందరెందరో ఘను లందరకును జోత
పలుకుమయ్య నేడు తెలుగుబిడ్డ.

పూని తెమ్మొ నేయి తేనె ద్రాక్షరసము
ఎంత ప్రాతవైన అంత మేలు
కాని – ప్రాతవనుచు కఠిన యాచారముల్
తలను దాల్చవలదు తెలుగుబిడ్డ.

పెద్ద లెవ్వరేని పిలిచి చెప్పినగాని
పనికిమాలినట్టి పనికి బోకు
న్యాయమెరిగి నీవు నడచుకొన్నప్పుడె
కలుగునయ్య మేలు తెలుగుబిడ్డ.

పిన్నవారి యెడల ప్రేమ చూపిన, నిన్ను
ప్రేమ జూతురయ్య పెద్దవారు
పరుల గౌరవించి పడయు గౌరవ మీవు
చెలిమి చెలిమి దెచ్చు తెలుగుబిడ్డ.

తగని వైరమందు తల దూర్చగాబోకు
వైరి ఎదుట శిరము వాల్చరాదు
అరుల కలవిగాని ఆత్మాభిమానమే
కలిమి బలిమి నీకు తెలుగుబిడ్డ.

వేపచెట్టు మొదల విరితేనె బోయించి
పెంచినంత చేదువిడునె కాయ
దొడ్డమాటలాడి దుష్టమతి కొక మంచి
తెలియ జెప్పగలమె తెలుగుబిడ్డ.

చూడ ముచ్చటైన సుందరుండేయైన
హీనుడైన ప్రజలకేమి మేలు
ముట్టరుకద ఎఱ్ఱమోదుగ పువ్వుల పరి
మళము లేనికతన తెలుగుబిడ్డ.

వేషధారి తాను విజ్ఞువలె నటియించు
అజ్ఞు డెపుడు విజ్ఞుడగునె భువిని
పాలు నీరు వేరుపరచునే హంసవలె
తెల్లనైన కొంగ? తెలుగుబిడ్డ.

కంచమందు తిండి, మంచమున కొక పంచ
కట్టుబట్ట లీయగలరు కాని
మనసునిచ్చి పెంచు మాన్యులు గావలె
ధీరవృత్తి నేర్ప తెలుగుబిడ్డ.

వాన రేగటి బడవచ్చు తీయనినీరు
మంచివాని మైత్రి మధురమిచ్చు
చవిటి నేల జల ముప్పులై పోవు
చెడ్డవాని పొందు చేటు దెచ్చు.

విలువ గలిగినట్టి వలువలు దాల్చిన
దాయవచ్చు గొంత తనువు నిజమె
దాచుకొనగ తరమె నీచగుణము లెందు
ఖలులు నిత్యవృత్తి? తెలుగుబిడ్డ.

తనను బోలవలయు తనబిడ్డలని తలచు
తండ్రిమనసు దారి తప్పినట్లె
భావితరమువారి బట్టి వెనుకకు లాగ
తలచు టేమి సబబు? తెలుగుబిడ్డ.

కడచిపోయినట్టి క్షణము తిరిగిరాదు
కాలమూర కెపుడు గడుపబోకు
దీపమున్న యపుడె దిద్దుకోవలె నిల్లు
విలువ దెలిసి చదువు తెలుగుబిడ్డ.



కోట్లు ఖర్చు చేసి గుళ్లు కట్టింతురు
కూడు లేనివారి గోడు వినరు
పాపమెల్ల జేసి వట్టి పూజలు చేయ
ఫలిత మేమి కలదు తెలుగుబిడ్డ.

సాటి మనుష లన్న మాట మరచిపోయి
అంటకూడ దనుచు హరిజనులను
ఊరు బట్టనీరు, నీరు ముట్టగనీరు
దీని మాన్పవలయు తెలుగుబిడ్డ.

దుమ్ము గొట్టుకొనుచు దొర్లాడు పిల్లల
చూడగలవు కూలిగూడె మందు
చదువు లేదు వేరె సంస్కారమును లేదు
వారి మేలు కొరకు పాటుబడుము.

మేడి విడిచి రైతు మెయి వ్రాల్చినది లేదు
కూలి మిల్లు వదలి కునుకలేదు
కాని, వీరి చెమట కలవారి మేడ మి
ద్దెలకు జిలుగు లాయె తెలుగుబిడ్డ.

నంది పంది కూడ నారాయణులె సుమ్ము
పుట్ట గట్టు లెల్ల పూజితములె
కాని, సాటి నరుడు కడు నీచుడై పోయె
కులము పేదటన్న తెలుగుబిడ్డ.

కడుపు నిండనట్టి కష్టజీవి కెపుడు
స్వార్థ మింత లేక సాయపడుము
ప్రతిఫలమ్ము లేక పండ్లీయవా చెట్లు
వలయువారి' కెల్ల తెలుగుబిడ్డ.

కోడితోనె లేచి కూర్చొడు నందాక
కూడు లేక దేవులాడుకొనుచు
పాడు గుడిసెలందు బ్రతుకు వారి కొరకు
వలయు సాయ మిమ్ము తెలుగుబిడ్డ.

కులము తక్కువంచు, కలిమి లేదంచును
పలువరించు వారి పలుకు వినకు
కులము కలుము లెపుడు నిలిచేవి కావురా
నిలుచు గుణగణాలు తెలుగుబిడ్డ.

కులము పేరు జెప్పి కుళ్ళు పెంచగనేల
కులము జోలి యేల గుణమె చాలు!
వాసన గల పూవు పరిమళించిన రీతి
తెలివి రాణ కెక్కు తెలుగుబిడ్డ.

పగలు రాత్రి పాటుబడుచు నుండును కూలి
కడుపు నిండబోదు కరువె కాని
కడుపు మాడి వాడు పడిపోయెనా యేని
పొలములెట్లు పండు తెలుగుబిడ్డ.

వెన్క అండలేని వికలాంగు లంధులు
బిచ్చ మడుగ తెచ్చి పెట్టుమయ్య
కలిగినంతలోనె గంజి నీళ్ళిచ్చుటే
దివ్య ధర్మ మోయి తెలుగుబిడ్డ.

హిందువితడు ముస్లి మితడంచు భేదాలు
మోసగాండ్రు సృష్టి జేసినారు
రెక్క లమ్ముౘవారి దొక్కటే బ్రతుకురా
కుల మతాలు లేవు తెలుగుబిడ్డ.

సన్నిహితుల మధ్య జగడాలు కల్పించు
వారి గుణము బట్టబయలు చేసి
పోరు నష్ట మనుచు పొందు లాభమటంచు
చెలిమి బెంచుమయ్య తెలుగుబిడ్డ.

దేశ మనెడు పూదోటలో బూసె పూలు
తేనె ధారలు గట్టె పూదీవెకొనల
కొమ్మ కొమ్మను కోకిలల్ కూయ దొడగె
చిలిపి తగువింక మనల కేల తెలుగుబిడ్డ.



స్వేచ్ఛ శాంతి వృద్ధి వెలయింప నూరూర
బాలసంఘ మొకటి పాదుకొలిపి
ధైర్యసాహసములు త్యాగబుద్ధి గలిగి
మెలగుడయ్య సతము తెలుగుబిడ్డ.

సంధ్యవేళ బాల సంఘము చెప్పిన
క్రొత్తయాట లాడుకొనగ వలయు
కోడి రామమూర్తి గొప్పవా డెట్లాయె
తెలియు మా చరిత్ర తెలుగుబిడ్డ.

ముసలి వగ్గురీతి మూల గూర్చున్నచో
బలము రాదు చదువు బాగుపడదు
బక్కమనిషి గట్టి పనులెట్లు చేయురా
దేశసేవ కొరకు తెలుగుబిడ్డ.

బుద్ధిబలము పెంచి పుష్టి నొసంగెడు
మంచియాట లెన్నొ మనకు లేవె?
గోలికాయలాట కోతి కొమ్మచ్చులు
మరిగి బడికి మాని తిరగబోకు

ఆటపాటలందు సాటివారిని మించి
దినము కొక్కరీతి తేజరిలుము
మందకొడిగనున్న మనిషిని మెచ్చరు
తెలిసినట్టివారు తెలుగుబిడ్డ.

కలసికట్టుతనము ఘనముగా కావలె
ఆటకైన మంచి పాటకైన
ఐకమత్యభావ మంతకంతకు బెంచి
తేజరిల్ల వలయు తెలుగుబిడ్డ.

మూఢనమ్మకముల మునిగిపోవుటచేత
దెయ్యములకు కులము దేవరలకు
జంతువులను గోసి జాతరల్ సేయుట
తెలివిలేని పనులు తెలుగుబిడ్డ.

జ్వరము వచ్చినపుడు జాగ్రత్తపడకుండ
ముడుపు కట్టినంత తుడువ నగునె
ఔషధమ్ము లేక వ్యాధులు తగ్గునా
తలచినంతలోన తెలుగుబిడ్డ.

సస్యలక్ష్మితోడ సంక్రాంతి యరుదేర
పల్లెటూళ్ళ దురలవాట్ల జిక్కి
కోడిపందెమంచు గొర్రెపందెములంచు
తిరుగబోకుమయ్య తెలుగుబిడ్డ.

పర్వదినములందు పదిమందితో గూడి
ఆటపాటలందు పోటి బెట్టి
నాటకములు వేసి తోటివారిని జేర్చి
మంచి నీతి మీరు పెంచవలయు.

చీట్లు పేకలకును చిత్తాటలకు బోవు
చెడ్డవారి దరిని చేరబోకు
కొంపగూల్చు పనులు కూడదనుచు నీవు
తెలియ జెప్పవలయు తెలుగుబిడ్డ.

పాడు జూదమాడి పదమూడు వత్సరాల్
పాండవేయు లడవిపాలుగారె
వచ్చె మాయదారి పలనాటి యుద్ధము
కోళ్ళ పందెములను కోరివేయ.

అట్టి దురలవాట్ల నన్ని మాన్పింపగా
బాలు రెపుడు పాటు బడగవలయు
మిమ్ము చూచి వారు మెచ్చి, సిగ్గుపడుచు
తెలివి దెచ్చుకొంద్రు తెలుగుబిడ్డ.

పెద్దవారికంటె పిన్నలె కడుగొప్ప
కలిసిమెలిసి యుండగలరు వారె
దేశమాత నుదుట దివ్యరేఖలు తీర్చి
తేజ మీయగలరు తెలుగుబిడ్డ.



జన్మభూమికంటె సర్వంబు వేరేది
మాతృభాషకంటె మధుర మేది
కన్నతల్లికంటె ఘనదైవ మింకేది
తెలియుమయ్య నీవు తెలుగుబిడ్డ.

ఎట్టి ఋణమునైన ఎటులొ తీర్తువుకాని
తల్లి ఋణము దీర్ప తరము కాదు
ఆమె ప్రేమ సతము రామరక్షయె నీకు
కలిమి కూర్చుచుండు తెలుగుబిడ్డ.

రమణిమాట నమ్మరాదని యందురు
తల్లి నమ్మనట్టి తనయు డున్నె?
రాజ్యమేలినట్టి రాణి రుద్రమదేవి
నిలుపలేదె పేరు తెలుగుబిడ్డ.

స్త్రీని గౌరవించు దేశమే స్వర్గము
పడతి యేడ్చు యిల్లు వల్లకాడు
తల్లి గూర్చి చెడ్డ తలపులేల కలుగు
తెలివి చెడినగాక తెలుగుబిడ్డ.

మంచితనము చూపి మనసియవలెగాని
మేలమాడదగదు బాలికలను,
బుద్ధిహీనుడు పలు పోకిళ్ళు పోయిన
ఫలిత మనుభవించు తెలుగుబిడ్డ.

చిన్న తనమునుండి స్త్రీలపట్ల మధుర
గౌరవ గుణముండి తీరవలయు,
పెద్దవైన పిదప పెన్నిధివలె తోడు
నిలుచు గౌరవంబు తెలుగుబిడ్డ.

కన్నతల్లి వోలె కాపాడుచుండును
మూడు వేళలందు భుక్తినొసగు
పాడిపంటల కిది బంగారు తల్లిరా
తెలుగు పంట పొలము తెలుగుబిడ్డ.

రాజనాలు పండు రతనాల సీమలో
జీవనదులు పారి శ్రీలు గురియు
భోగ భాగ్యములకు పుట్టిల్లు మన తల్లి
కలిత కల్పవల్లి తెలుగుబిడ్డ.

వందలాది మేలి వజ్రరాసులు పోసి
విజయనగర రాజ వీధులందు
తిరిగి యమ్మిరంట ఎరుగుమా వైభవాల్
కలిమి బలిమి నీవు తెలుగుబిడ్డ.

నాడు నేడు కూడ నవ్యపథము లేర్చి
దివ్య మార్గగామి తెలుగువాడు
ప్రాత క్రొత్త నడుమ బంగారు వంతెనల్
నిలిపినట్టివాడు తెలుగుబిడ్డ.

జీవ మొసగి శిలల చిత్రాలు చెక్కిరి
ఈవి గలిగి రాజ్యమేలినారు
వేయి వత్సరాల వీరగాథలు నీవి
తెలిసికొమ్ము నీవు తెలుగుబిడ్డ.

శీతనగము మొదలు సేతువు కడదాక
తెలుగువారి కీర్తి తేజరిల్లె
ఐదు ఖండములకు వ్యాపించి మన తెలుగు
ధీనిధులు చరింత్రు తెలుగుబిడ్డ.

